ఓ౩మ్

# వైదిక ధర్మము

మాస పత్రిక

మనుర్భవ జనయా దైవ్యమ్ జనమ్ ( ఋ. ౧౦-౫౩-౬ )

సంపుటి ౫ | సౌర సహస్య (పుష్యము ౧౯౧౪ శక) ౨౦౪౯ వి. | సంచిక ౫

## స్వాధ్యాయము

హిందీ మూలము

ఆచార్య భగవాన్‌దేవ్ బ్రహ్మచారీ
దేవవ్రత బ్రహ్మచారీ
గురుకుల్, ఝజ్జర్, హరయాణా

అనుసరణ

**లోకమల్హారి, సిద్ధాంతాచార్య**
వైదిక పురోహితులు, ఇందూరు



---

సూచనః-౧. 'వైదిక ధర్మము' మాసపత్రిక ద్వారా వైదిక సిద్ధాంతపరమైన చిన్న, పెద్ద గ్రంథాలను, జీవిత చరిత్రలను నెలకు ఈ ఆకారంలో ౨౮ పుటలను అందింపదలచినాము. పాఠకుల అభిప్రాయాన్ని తెలిసికోదలచినాము. (సూచన ౨ చివరి పుటలో)

---

సంపాదకులు: ఆచార్య వేదవ్రత మీమాంసక్
ప్రబంధకులు: కోటికె లక్ష్మయ్య ఆర్య, భాగ్యనగరము
**ఆర్ష గురుకులము కామారెడ్డి - ౫౦౩౧౧౧**
ఆజీవనము: రూ. ౩౫౦-౦౦ వార్షిక శుల్కము: రూ. ౩౫-౦౦

ఓం

# అనువాదకుని మాట

ఝజ్జర్ గురుకుల ఆచార్యులు శ్రీ బ్రహ్మచారి భగవాన్‌దేవ్, భాషాచార్య, సిద్ధాంత వాచస్పతి మరియు శ్రీ దేవవ్రత బ్రహ్మచారి హిందీలో "సత్సంగ్-స్వాధ్యాయ్" అను గ్రంథమును రచించిరి. దానిని నేను 'సత్సంగము', 'స్వాధ్యాయము' అని రెండు పుస్తకములుగా అనువదించియుంటిని. 'సత్సంగము' అను పుస్తకము రెండు సార్లు ముద్రితమైనది. ఇప్పుడు ఈ 'స్వాధ్యాయము' ముద్రింపబడుచున్నది.

బ్రహ్మచర్యమును పాటించుటకు పవిత్రమైన ఆలోచనలు, సాత్వికాహార సేవనము, వ్యాయామము, ప్రాణాయామము, సత్సంగము, స్వాధ్యాయము, ఈశ్వర భక్తి ముఖ్యము. వీనిని శ్రద్ధతో అనుష్ఠించవలయును, వీర్య రక్షణకును ఇవి ముఖ్య సాధనలే. వీనిని శ్రద్ధతో నియమపూర్వకముగ పాటించు వ్యక్తి బ్రహ్మచారిగా ఉండగలడు. బ్రహ్మచర్యమును పాటించక, వీర్యమును రక్షించుకొనక ఊర్ధ్వరేతస్కుడగుట అసంభవము.

ఈ చిన్న పుస్తకము స్త్రీ పురుషులందరికి, విశేషించి విద్యార్థినీ విద్యార్థులకు మిక్కిలి ఉపయోగకరమైనది. కావున అందరు దీనిని పలుమార్లు స్వాధ్యాయము చేసి లాభము పొందవలసి ఉండును.

తెలుగు సాహిత్యమున పురాణములు, రామాయణ, భారత, భాగవతాదులు, కథలు, కథానికలు, వ్రతమాహాత్మ్యములు, గద్య, పద్య, ఖండ కావ్యాదులు, నవలలు, నాటక నాటికలు పుష్కలముగనే ఉన్నవి. నేడు క్రొంగ్రొత్తరీతిలో నవలలు, కథానికలు విరివిగా వెలువడుచున్నవి.

వివిధ మత సంప్రదాయములకు సంబంధించిన గ్రంథములు గూడా వెలువడుచున్నవి. కాని మానవ కల్యాణమునకు, ఆత్మోన్నతికి అత్యావసరమైన వైదిక సాహిత్యము తెలుగు భాషలో అతి స్వల్పమే అనవచ్చును. సంస్కృతము, ఆర్యభాష (హిందీ) తెలియని, తెలుగు సోదర సోదరీమణులు వైదిక సాహిత్యమును అధ్యయనముచేయు అవకాశము లేకున్నది. ఆలోటును తీర్చుటకు కొందరు పండితులు అట్టి సాహిత్య నిర్మాణమునకు ప్రయత్నించుచున్నారు. మహాపురుషుల వ్యాఖ్యానములను, ప్రబోధములను ఆర్యభాషనుండి తెలుగులోనికి అనువదించి ముద్రింపజేయుచున్నారు. అట్టి ప్రయత్నములోని ఒక అల్పభాగమే ఈ నాకృషి.

కల్యాణేచ్ఛతో యథార్థ మార్గమును వెదకు నవయువతీ యువకులకు ఈ చిన్ని పుస్తకము దీపస్తంభమువంటిదై వారి అజ్ఞానాంధకారమును దూరముచేయగలిగినచో ఈ నాకృషి సార్థకమైనట్లు తలచెద.

బుధజన విధేయుడు

**లోకామల్హారి, సిద్ధాన్తాచార్య**

ఇందూరు (ఆం. ప్ర.)

"ప్రపంచమునకు ఉపకారముచేయుట అనగా శారీరక, ఆత్మిక, సామాజిక ఉన్నతిని కలుగజేయుట ఈ సమాజ ముఖ్యోద్దేశ్యము"

(ఋషి దయానందుడు, ఆర్యసమాజ నియమము ౬)

పై త్రివిధ ఉన్నతులను సాధించుటకు సత్యజ్ఞానాన్ని కలుగజేయు, మూఢ విశ్వాసములను తొలగించు "సత్యార్థ ప్రకాశమును" చదువుడు, చదివించుడు. జీవిత సర్వాంగీణ వికాసమును సాధించుడు.

# స్వాధ్యాయము

వేదము సమస్త సత్య విద్యల గ్రంథము. దీనిని చదువుట చదివించుట, వినుట వినిపించుట ఆర్యులందరి పరమ ధర్మము.

(మహర్షి దయానంద సరస్వతీ)

మనము ఆర్యులము. వేదములను చదువుట, చదివించుట మన పరమ ధర్మము. ఈ పరమ ధర్మమును పాలించుటకు ప్రతిదినము వేద స్వాధ్యాయము చేయవలయును. లేనిచో మనము ధర్మచ్యుతుల మగుదుము. పశువులవలె నగుదుము. మన అస్తిత్వమునే కోల్పోవుదుము. ధర్మమును వదలిన ధర్మాత్ముడు నశించు నని ప్రసిద్ధి. ఎట్లన వేడిమి అగ్ని ధర్మము. వేడిమి ఉన్నంతవరకే దానిని అగ్ని అందుము. అగ్ని తన ధర్మమగు ఉష్ణమును కోల్పోయినంతనే దాని నెవ్వరును అగ్ని అనరు. అది బొగ్గు గానో బూడిదగానో మారును. మనస్థితియు అంతే. మనము మన ధర్మ మును పాలించుచు నియమము తప్పక వేద స్వాధ్యాయము చేయుచున్నంత వరకు సజీవులమై ఉన్నతి మార్గమున ముందడుగు వేయుచుందుము. మనలో ఆర్యత్వము (మానవత్వము) స్థిరపడును. లేకున్న మన ఆర్యత్వము నశించును. ఆత్మ పతితమగును. మృతప్రాయమగును.

"వేద సన్న్యాసతః శూద్ర స్తస్మాద్వేదం న సంన్యసేత్" ॥మను॥

వేదముల త్యజించిన, వేద స్వాధ్యాయము చేయకున్న మనుష్యుడు శూద్రుడగను.

**అనభ్యాసేన వేదానామాచారస్య చ వర్జనాత్ ।**

**ఆలస్యాదన్నదోషాచ్చ మృత్యుర్విప్రాన్ జిఘాంసతి॥మను॥**

వేదముల స్వాధ్యాయము చేయకున్న మానవుడు ఆచారహీనుడగును. సోమరితనము వంటి ప్రమాదములకు లోనగును. మృత్యువు పాలగును.

అట్లుగాక వేదాది సచ్ఛాస్త్రముల స్వాధ్యాయముచేసిన సదాచారియగును. అలస్యాది ప్రమాదములకు లోనుగాడు. కావున మృత్యువునకే మృత్యువై మరణ భయము లేకుండును.

బ్రహ్మచర్యేణ తపసా దేవా మృత్యుమపాఘ్నత॥అథ. ౧౧-౫-౧౯॥

బ్రహ్మచర్య, వేదాధ్యయన, ఈశ్వరచింతన, వీర్య రక్షణ రూప తపస్సు ద్వారా విద్వాంసులు మృత్యువునే ప్రతిఘటింతురని వేద ముపదేశించుచున్నది. ఈ స్వాధ్యాయ యజ్ఞమును జీవితాంతము చేయ వలసియుండును. ఒక ఆశ్రమమున ఒక యజ్ఞము, మరొక ఆశ్రమమున రెండు యజ్ఞములు, ఇంకొక ఆశ్రమమున ఐదు యజ్ఞములు మనశాస్త్ర కారులు విధించినారు. స్వాధ్యాయ యజ్ఞము మాత్రము అన్ని ఆశ్రమముల వారికి అనివార్యమని తెలిపినారు.

వేదాధ్యయనమునకు బ్రహ్మచర్య పాలనము ముఖ్యము. నాల్గు వేదముల గాకున్నను ఒక్క వేదము నైనను సాంగోపాంగముగ చదువ వలెను. అట్లు చదివినవాడే గృహస్థుడగుట కర్హుడు.

వేదానధీత్య వేదౌ వా వేదం వాఽపి యథాక్రమమ్।
అవిప్లుత బ్రహ్మచర్యో గృహస్థాశ్రమమావిశేత్॥మను ౩-౨॥

బ్రహ్మచారి నాల్గు వేదములను గాని, రెండు వేదములను గాని, చదువలేకున్న కనీస మొక్క వేదము నైనను యథాక్రమముగ— శిక్షా, కల్పము, వ్యాకరణము, నిరుక్తము, ఛందస్సు, జ్యోతిషము అనెడు వేదాంగముల సహితముగ అధ్యయన మొనర్చి "గురుణానుమతః" ఆచార్యుని అనుమతితో గృహస్థాశ్రమమున ప్రవేశింపవలసి యుండును.

గృహస్థాశ్రమమున ప్రవేశించియు స్వాధ్యాయ యజ్ఞమును ప్రతి దినము తప్పక చేయుచునే ఉండవలెను. గృహస్థాశ్రమమున ప్రవేశింప

వలచిన బ్రహ్మచారిని సమావర్తన సమయమున ఆచార్యుడిట్లు హెచ్చరించును.

స్వాధ్యాయాన్మా ప్రమదః స్వాధ్యాయ ప్రవచనాభ్యాం న ప్రమదితవ్యమ్ ( తైత్తిరీయారణ్యక, శిక్షావ. ౩-౧౧ )

శిష్యా! నీవు స్వాధ్యాయమున సదా అప్రమత్తుడవై ఉండుము. ప్రతిదినము స్వాధ్యాయ ప్రవచన (వ్యాఖ్యాన) ములను జరుపుచుండుము.

స్వాధ్యాయే నిత్యయుక్తః స్యాద్దాన్తో మైత్రః సమాహితః ।
దాతా నిత్యమనాదాతా సర్వభూతానుకంపకః ॥ మను. ౬-౭॥

వానప్రస్థుడు జితేంద్రియుడై సర్వదా స్వాధ్యాయరతుడై అప్రమత్తుడై ఉండవలెను. సాంసారిక విషయాదులందు ఇంద్రియ నిగ్రహము గలవాడై, సమస్త ప్రాణులపై కృపాదృష్టి గలవాడై విద్యా దానము చేయుచుండవలెను. ఎవ్వరితోను, ఎట్టి ప్రతిఫలము నాశించరాదు. నాలుగవదగు సంన్యాసాశ్రమమున సమస్త సాంసారిక సాధనములను త్యజించినను స్వాధ్యాయాదులను త్యజింపరాదని తెలుపబడినది.

" సంన్యసేత్సర్వ కర్మాణి వేదమేకం న సన్న్యసేత్ "

సన్న్యాసి సమస్త సాంసారిక విషయాదులను త్యజించియును వేద స్వాధ్యాయమును మాత్రము విడువరాదు. స్వాధ్యాయము సన్న్యాసులకును అనివార్యమే.

ఇట్లు శాస్త్రకారులు బ్రహ్మచర్య, గృహస్థ, వానప్రస్థ, సన్న్యాసము లను నాలుగాశ్రమములందును స్వాధ్యాయ యజ్ఞము అనివార్యమని తెలిపి నారు. ఈ కాలమున గూడ మానవుడు ప్రాపంచిక వ్యవహారమున

మునిగియున్నను స్వాధ్యాయము తప్పక చేయవలసియుండును. ప్రాణికి ఉచ్ఛ్వాస నిశ్శ్వాసము లెంత అవసరమో మానవునికి స్వాధ్యాయ మంతయే అవసరము-శ్వాస ప్రశ్వాస క్రియలు యావజ్జీవితము నిరంతరము జరుగుచుండును. అట్లే స్వాధ్యాయ యజ్ఞము ప్రతి దినము అఖండిత రూపమున జరుగుచుండవలెను.

వేదోపకరణే చైవ స్వాధ్యాయే చైవ నైత్యికే,
నానురోధో౽స్త్యనధ్యాయే హోమమంత్రేషు చైవ హి ।మ. ౨-౧౦౫

నైత్యికే నాస్త్యనధ్యాయో బ్రహ్మ సత్రం
హి తత్స్మృతమ్ ॥ మను. ౨-౧౦౬ ॥

వేదములను చదువుటలో, స్వాధ్యాయాది నిత్య కర్మలలో ఎన్నడును అనధ్యాయ ( చదువ గూడని, ఆట విడుపు) దిన ముండదు. సదా స్వాధ్యాయము చేయుచునే ఉండవలెను. ఏలన స్వాధ్యాయ కర్మయే బ్రహ్మ యజ్ఞము. ఈ బ్రహ్మ యజ్ఞమును అన్ని ఆశ్రమములవారు, అన్ని వర్ణములవారు ఎల్లెడల, ఎల్లప్పుడు అనుష్ఠింప వలసియుండును.

ఒక వేళ ఏదేని కార్యవిశేషమువల్ల స్వాధ్యాయమునకు విఘ్నము కలుగనున్నచో అట్టి కార్య విశేషమును వదలవచ్చును. కాని ఎట్టి పరిస్థితిలోను స్వాధ్యాయమును వదలరాదు.

“ సర్వాన్ సన్న్యసేదర్థాన్ స్వాధ్యాయస్య విరోధినః ”

జీవన యాత్రకొరకు ఇతర కార్యముల జేయుచునే మనము ప్రతి దినము స్వాధ్యాయము చేయుచుండవలెను. స్వాధ్యాయ కార్యము క్రమముగా జరుపుకొనుటకు మనము ఆయా కార్యములకు తగిన

సమయమును నిర్ణయించుకొనవలెను. నిర్ణీత సమయములందు ఆయా కార్యముల జేయుచుండవలెను. తన వృత్తి కనుకూలమైన దినచర్యను నిర్ణయించుకొని దానిని పాటించుచుండవలెను. అందు స్వాధ్యాయమునకు తప్పక స్థానముండవలెను. అందుకు ప్రాతఃకాల సమయమే సర్వోత్తమ మని మను మహర్షి నిర్దేశించినాడు.

బ్రాహ్మే ముహూర్తే బుధ్యేత ధర్మార్థౌ చానుచింతయేత్ ।
కాయక్లేశాంశ్చ తన్మూలాన్వేదతత్త్వార్థమేవ చ ॥ మను. ౪-౯౨

బ్రాహ్మముహూర్తమున మేల్కొనవలెను. ధర్మార్థములను, శరీర క్లేశములను, వాటి కారణములను తెలిసికొనుచు వేదతత్త్వచింతనము చేయవలెను. స్త్రీ పురుషులందరు, ప్రత్యేకించి బ్రహ్మచారులు బ్రాహ్మ ముహూర్తముననే నిదురలేచి నిత్య కర్మల దీర్చుకొని శాంత చిత్తులై వేదాది సత్య శాస్త్రముల స్వాధ్యాయము తప్పక చేయుచుండవలెను. నేడు ప్రజలకు స్వాధ్యాయమునందు అయిష్టత ఏర్పడినది. నాగరికులు స్వాధ్యా యము యొక్క అవసరమును, విలువను ఏ మాత్రము గుర్తింప లేకున్నారు. అందువల్ల క్రమముగా స్వాధ్యాయము మరుగున పడిపోవు చున్నది. మానవ సమాజమునుండి మానవత్వము సిగ్గుపడి పారిపోవు చున్నది. దానవత్వ సామ్రాజ్యము స్వైర విహార మొనర్చుచున్నది. విజృంభించుచున్నది. ఈ దానవత్వ, దురాచార, వ్యభిచారాదుల ప్రభావము నరికట్టుటకు స్వాధ్యాయము పరమావశ్యకము. స్వాధ్యాయము లేని కారణముననే ఈ భయంకర పతనము కలిగినది. స్వాధ్యాయము చేయు చున్నచో మన మిప్పుడైనను బాగుపడగలము. కావున అందరు స్వాధ్యాయ వ్రతదీక్ష గైకొనవలెను. దానిని నియమ పూర్వకముగా పాటించవలెను. శరీరమునకు భోజనమువలెనే మనస్సునకు స్వాధ్యాయ మత్యావసరమని మరువరాదు.

"మాకు స్వాధ్యాయమునకు సమయమే లభించ" దని కొందరేదో సాకు చెప్పుచుందురు. కాని అది సరిగాదు. సమయ మనునది మానవుని అధీనమందుండును. దాని నతడు ఇష్టమున్న రీతిలో ఉపయోగించుకొన వచ్చును. ౨౪ గంటలనుండి కనీసము ఒక గంటయైనను స్వాధ్యాయము కొరకు సులభముగా కేటాయించుకోవచ్చును. ఈ ఒక్క గంటలో ప్రతి దినము ౨౦ పుటల చొప్పున వైదిక ధర్మ గ్రంథము నొకదాని స్వాధ్యాయము చేయుచుండిన ఒక సంవత్సరము (౩౬౫ దినముల)లో ౭౩౦౦ పుటలు చదువవచ్చును. ఇట్లు సుదీర్ఘ జీవిత కాలమున ఎన్ని వేల గ్రంథముల స్వాధ్యాయము చేయవచ్చునో ఆలోచించుడు!

కాని మనము మన అమూల్య సమయమును శరీరాలంకరణలో, ఆట - పాటలలో, వ్యర్థ ప్రసంగములలో, వ్యర్థ వాదవివాదములలో, నికృష్ట సాహిత్యపఠనలో నాశనము చేయుచున్నాము. జూదము, పేకాట, చెడు పథకములు, సోమరితనము మున్నగు వానియందు వ్యర్థము చేయుచున్నాము. అమూల్య సమయము నిట్లు పాడుచేసికొనువారు తమ జన్మనే నాశనము చేసికొనుచున్నారని మరువరాదు. ప్రతి క్షణము వ్యక్తి జీవితము చక్కబడుటయో, పతనమగుటయో జరుగుచుండును. కావున ఇట్టి అమూల్య సమయమును తమ ఉన్నతి కనుకూలమైన రీతిలో వినియోగించుకొనువారే బుద్ధిమంతులు, ఉత్తములు.

## స్వాధ్యాయము - అర్థవివరణ

'సు' లేక 'స్వ' ఉప పదమున ఉండుటచే 'ఆఙ్' అధి పూర్వక అధ్యయ నార్థక 'ఇఙ్' ధాతువు వల్ల పాణినీయ సూ. ౩-౩-౨౧ 'ఇఙశ్చ' ననుసరించి 'ఘఞ్' ప్రత్యయ మొనర్చుటచే 'స్వాధ్యాయ' శబ్ద మేర్పడుచున్నది. "సుష్ఠు ఆవృత్య అధ్యయనం స్వాధ్యాయః" "స్వయ

మధ్యయనం స్వాధ్యాయః'' చక్కగా ఆవృత్తిపూర్వకముగా అధ్యయనము చేయుట, తనను అధ్యయనము చేసికొనుట స్వాధ్యాయము. ఇందలి 'స్వ' శబ్దమునకు ఆత్మ, ఆత్మీయ మున్నగు అర్థము లనేకము. కావున స్వాధ్యాయ శబ్దమునకు గూడ వివిధార్థము లున్నవి. వ్యాస మహర్షి యోగదర్శన ( ౨-౧; ౨-౩౨ ) భాష్యమున స్వాధ్యాయ శబ్దార్థము నిట్లు వివరించినాడు. "స్వాధ్యాయః ప్రణవాది పవిత్రాణాం జపః, మోక్ష శాస్త్రాధ్యయనం వా'' ప్రణవము-ఓం౩మ్, గాయత్రీ మున్నగు మంత్రముల జపము, మోక్షశాస్త్రముల, ఆధ్యాత్మిక గ్రంథముల, దర్శనముల, ఉపనిషదాదుల పఠనము 'స్వాధ్యాయ' మనబడును.

నిఘంటు కర్త లెల్లరు 'స్వాధ్యాయ' శబ్దము వేదాధ్యయన శబ్దమునకు పర్యాయ వాచక మని నుడివినారు.

"స్వాధ్యాయః వేదే స్వాభిమతః ప్రణవాదిమన్త్ర జపే బ్రహ్మయజ్ఞే. వేదాధ్యయనే. ఫలవదర్థావబోధపర్యన్తాధ్యయనే. ఉపనిషద్గ్రంథాకృతౌ, మోక్షశాస్త్రాణామధ్యయనే. సు అతీవ అవృత్య అధ్యయనం. స్వార్థమధ్యయనం వా"

"స్వాధ్యాయః సుష్ఠు అవృత్య అధ్యాయః వేదాధ్యయనమితి"

(శబ్ద కల్పద్రుమ బృహదభిదానమ్) (శబ్దార్థ చింతామణి)

"స్వాధ్యాయః స్యాజ్జపం," "ద్వేవేదాధ్యయనస్యేతి" తత్టీక ( అమరకోశము )

"స్వాధాయో జప ఇత్యుక్తో వేదాధ్యయన కర్మణి"

( శబ్దరత్నావళి )

"ద్వే అవృత్య వేధాధ్యయనే. సుసుకృతాయ అవృత్య

అధ్యాయోఽదితిః స్వాధ్యాయః" ( భరతః )

"చక్కనిరీతిలో శాస్త్రముల అధ్యయనము చేయుటయే స్వాధ్యాయము" ( హిందీ విశ్వకోశ్ )

ఇట్లు సమస్త నిఘంటు కర్తలు స్వాధ్యాయ శబ్దమునకు వేదములు, దర్శనములు, ఉపనిషత్తులు మున్నగు శాస్త్రములను ఆత్మ కల్యాణము కొరకు అధ్యయనముచేయుట, ఆత్మ చింతనము, ఈశ్వర భక్తి, ప్రణ వాదుల జపము మున్నగు అర్థముల నిచ్చినారు. అట్లే 'స్వాధ్యాయీ, స్వాధ్యాయశీలుడు' అను శబ్దములకు గూడ విశిష్ట రూపమున వేదాధ్యయ నము చేయువాడను అర్థమే గలదు

"స తూర్ధ్వరేతా స్తపసి ప్రసక్తః, స్వాధ్యాయవాన్ వీత భయః కృతాత్మా । చచార సర్వాన్ పృథివీం మహాత్మా, న చాపి దారాన్ మనసాప్యకాంక్షత్" ( మహాభార. ౧-౪౦-౧౦ )

స్వాధ్యాయము, బ్రహ్మచర్య పాలనము మున్నగు తపస్సుం ద్వారా తపస్సు నాచరించుచు భయ శోకాదులు లేనివాడు, ఊర్ధ్వరేతస్కుడు, జితేంద్రియుడునైన మహాత్మా జరత్కారుడు భూమండల మంతట భ్రమణము చేయసాగెను. అయన తన మనస్సులో నెన్నడును స్త్రీ సంబంధాది కాముకాలోచనల నేమాత్రము రానీయలేదు

అశ్లీలములు, అనార్షములు, ఉత్తేజకరములు అగు నాటకములు, నవలలు, కథలు, సినెమాలు, సంగీతము, రామలీలలు, రాసలీలలు వంటి అసభ్యకరములైన దృశ్యములను చూచుట, అట్టి పుస్తకములను చదువుట, వినుట స్వాధ్యాయ మెన్నటికిని కాజాలదు. ఆత్మోన్నతికి స్వాధ్యాయము సర్వోత్తమ సాధనము. నాటకములు. సినెమాలు, దూరదర్శనము (టీ.వీ.), నవలలు మున్నగువానిని చూచుట, చదువుటవల్ల ఉన్నతికి మారుగా అవనతియే కలుగుచుండును.

కొందరు వార్తాపత్రికలు, నవలలు మున్నగు వానిని చదివియే తృప్తిని, సంతుష్టిని పొందుదురు. అదియే వారి దృష్టిలో స్వాధ్యాయము. దీనిని స్వాధ్యాయ మనుకొనుట గొప్ప అజ్ఞానమే, అవివేకమే. పైన స్వాధ్యాయ శబ్దమున కర్థము సప్రమాణముగా వివరింపబడినది. ఇక ముందు స్వాధ్యాయమునకు తగిన గ్రంథములు పేర్కొనబడును. అట్టి గ్రంథముల అధ్యయనమే స్వాధ్యాయము. కాని వార్తాపత్రికలు, చిత్ర రకపు పుస్తకముల పఠన మెంతమాత్రమును స్వాధ్యాయ మనబడదు.

## స్వాధ్యాయ మహిమ

మన శాస్త్రములు—వేదములు, ఉపనిషత్తులు, స్మృతులు, దర్శనములు, బ్రాహ్మణములు, ఆరణ్యకములు మున్నగునవి స్వాధ్యాయ మహత్వము నెంతయో వర్ణించుచున్నవి. అందుకే మన పూర్వజులు—ఋషులు, మహర్షులు, మునులు మానవ జీవన విధానమున స్వాధ్యాయము గొప్ప మహత్తు గలదని తెలిపిరి. పంచమహాయజ్ఞములలో "స్వాధ్యాయ మొకటి అని తెలిపిరి "స్వాధ్యాయో బ్రహ్మయజ్ఞః" (శతపథబ్రాహ్మణము ౧౧-౫-౬-౩) యోగమున అష్టాంగములలో స్వాధ్యాయ మొకటి. "శౌచ సంతోషతపఃస్వాధాయేశ్వరప్రణిధానాని నియమాః" (యోగ. ద. ౨-౩౨). మను మహర్షి స్వాధ్యాయము సర్వోత్తమ తప మని తెలిపినాడు.

ధర్మ లక్షణములలో ఏడవదగు "ధీ" (విమల బుద్ధి)ని పొందుటకు స్వాధ్యాయమే ఉత్తమ సాధనము. వ్యాస మహర్షి స్వాధ్యాయమును గూర్చి ఇట్లు వ్రాసినాడు.

"స్వాధ్యాయాద్యోగమాసీత యోగాత్స్వాధ్యాయమామనేత్।
స్వాధ్యాయయోగ సంపత్యా పరమాత్మా ప్రకాశతే॥ యో.ద.

స్వాధ్యాయము ద్వారా యోగమున ప్రవృత్తుడై యోగము ద్వారా స్వాధ్యాయ చింతన మొనర్చవలెను. స్వాధ్యాయ యోగాభ్యాసముల

ద్వారా ఈశ్వరుని పొందగలుగును. ఛాందోగ్యోపనిషత్తు చివర ఇట్లు తెలుపుచున్నది.

"ఆచార్య కులాద్వేదమధీత్య యథావిధానం గురోః కర్మాతిశేషేణాభిసమావృత్య కుటుంబే శుచౌదేశే స్వాధ్యాయమధీయానో ధార్మికాన్విదధదాత్మని సర్వేంద్రియాణి సంప్రతిష్ఠాప్యాహింసన్సర్వభూతాన్యన్యత్ర తీర్థేభ్యః స ఖల్వేవం వర్తయన్యావదాయుషం బ్రహ్మలోకమభిసంపద్యతే న చ పునరావర్తతే"(ఛాందో. ౮౧౫-౧)

బ్రహ్మచారి గురుకులమున విధిపూర్వకముగ వేదములను చదివి గురు శుశ్రూషాదుల ముగించి సమావర్తన సంస్కారానంతరము గృహస్థమున ప్రవేశించవలెను. గృహస్థాశ్రమమున నున్నను పవిత్రస్థానమున కూర్చుండి వేదాది సచ్ఛాస్త్రముల స్వాధ్యాయ మొనర్చుచుండవలెను. ఇట్లు తన కుటుంబమునే కాక జనులను ధార్మికుల జేయుచుండవలెను. సర్వేంద్రియములను ఆత్మలో స్థిరపరచుకొని తీర్థస్థానము లందును, ఇతర స్థలము లందును ఏ ప్రాణికిని హింస గలుగకుండ మరణపర్యంతము వ్యవహరించుచుండవలెను. అట్లు చేసిన మోక్షమును పొంది ఆవాగమన చక్రమునుండి ముక్తుడగును. శతపథ బ్రాహ్మణము స్వాధ్యాయము నిట్లు ప్రశంసించుచున్నది—

"అథాతః స్వాధ్యాయ ప్రశంసా। ప్రియే స్వాధ్యాయప్రవచనే భవతోయుక్తమనా భవత్యపరాధినోఽహరహరర్థాన్ సాధయతే సుఖం స్వపితి పరమచికిత్సకఽ ఆత్మనో భవతీన్ద్రియసంయమశ్చైకారామతా చ ప్రజ్ఞావృద్ధిర్యశోలోకో పంక్తిః। ప్రజ్ఞా వర్ధమానా చతురోధర్మాన్ బ్రాహ్మణమభినిష్పాదయతి బ్రాహ్మణ్యా

ప్రతిరూపచర్యాం యశోలోకపంక్తిమ్। లోకః పచ్యమానశ్చతుర్భిర్ధర్మై బ్రాహ్మణమ్భునత్త్యర్చయా చ దానేన చాజ్యేయతయా చావధ్యతయా చ॥ శతపథ బ్రా. ౧౧-౫-౭-౧॥

ఇప్పుడు స్వాధ్యాయ మహిమ ప్రశంసింపబడు చున్నది. స్వాధ్యాయ ప్రవచనములు అత్యంత ప్రియమైనవి. శాంత చిత్తముతో స్వాధ్యాయము చేయు వ్యక్తి తన కార్యములను స్వతంత్రముగా నెరవేర్చుకొనుచు ఆనందము ననుభవించుచుండును. తన హితాహితములను ధ్యానమందుంచుకొనును. సంయమి, బుద్ధిశాలి, కీర్తి మంతుడగును. నిర్మల బుద్ధిగల స్వాధ్యాయ శీలుడైన వ్యక్తి ధర్మార్థకామమోక్షములను సులభముగా సాధించుకోగలడు. వాస్తవ బ్రాహ్మణత్వము గలవాడు, ఉత్తమ ఆచార వ్యవహారవంతుడు ప్రజలకు విశ్వాస పాత్రుడగును. ఆతనికి సకలదిశలనుండి సమ్మానము, ఆర్థిక సహకారము లభించుచుండును.

"యే హ వై కే చ శ్రమాః ఇమేద్యావాపృథివీఽఅన్తరేణ స్వాధ్యాయో హైవ తేషాం పరమతాకాష్ఠా య ఏవం విద్వాన్ స్వాధ్యాయమధీతే తస్మాత్ స్వాధ్యాయోఽధ్యేతవ్యః"

శతపథ బ్రాహ్మణము కాండ. ౧౧ అధ్యా. ౫ బ్రాహ్మణము ౭ శ్లోకం ౨

ప్రపంచమున మన కర్తవ్యములలో స్వాధ్యాయమే అతిశ్రేష్ఠము, అతి కఠినము. ఈ విషయము నెరిగి స్వాధ్యాయశీలురు తత్త్వమును (పరమాత్మ స్వరూపమును) చక్కగా తెలిసికొనగలరు. కావున స్వాధ్యాయము తప్పక చేయుచుండవలెను. ఋగ్వేదము (౧౦-౭౧-౯) నందు స్వాధ్యాయ మహిమ ఇట్లు తెలుపబడినది.

యస్తిత్యాజ సచివిదం సఖాయం న తస్య వాచ్యపి భాగో అస్తి।
యదీం శృణోత్యలకం శృణోతి నహి ప్రవేద సుకృతస్యపంథామ్॥

(యః) ఏ వ్యక్తి (సచివిదమ్) పరమేశ్వర ప్రాప్తిని, ఆతని జ్ఞానమును కలిగించు (సఖాయమ్) వేద స్వాధ్యాయ రూప మిత్రుని (తిత్యాజ) వదలివేయుచున్నాడో (తస్య) ఆ వ్యక్తి యొక్క (వాచి అపి) వాణియందును (న భాగ అస్తి) గ్రహించదగు తత్త్వముండదు. (యత్ ఈం శ్రణోతి) ఆతడు వినినదెల్ల (అలకం శృణోతి) మిథ్యయే వినుచుండును. (న హి ప్రవేద సుకృతస్య పంథామ్) అట్టి వాడు సుకృతమును పుణ్యమును. మోక్షస్థితిని తెలిసికొన జాలడు. కావున పరమ సుఖప్రదమైన, మోక్ష ప్రాప్తికి స్వాధ్యాయము తప్పక చేయవలెను.

## స్వాధ్యాయ ఫలము

యః స్వాధ్యాయ మధీతేఽబ్దం విధినా నియతః శుచిః ।
తస్య నిత్యం క్షరత్యేష పయో దధి ఘృతం మధుః ॥

(శతపథ బ్రాహ్మణము)

విధి పూర్వకముగా ఒక సంవత్సరమైనను శుద్ధుడై ఏకాగ్ర చిత్తముతో స్వాధ్యాయ మొనర్చునో వానికి ఋగ్యజుస్సామాథర్వణ వేదముల జ్ఞానము, మరియు జ్ఞానకర్మోపాసనాదుల ఫలము లభించగలదు. (మధుః) తేనె (పయః) పాలు (దధి) పెరుగు (ఘృతమ్) నేయి వీని మిశ్రణ విశేషము ఛందోబద్ధమైన వైదిక భాషా విశేషముతో పోల్చబడినది.

ఋగ్వేద, సామవేదములందలి స్వాధ్యాయ ఫలమును వర్ణించునట్టి ఆరు మంత్రములు విశేషించి పేర్కొనదగినవి. వానియందు స్వాధ్యాయము వలన గలుగు అనేక లాభముల విస్తృత వర్ణనగలదు. వానినుండి కేవలము మూడు మంత్రములు మాత్ర మిచ్చుట ఉదాహరించబడుచున్నవి.

" పావమానీర్ యో అధ్యేత్యృషిభిః సంభృతం రసమ్ ।
సర్వం స పూతమశ్నాతి స్వదితం మాతరిశ్వనా "
॥ సామ. ఉత్తరార్చిక ౧౦-౬-౧ ॥

( పావమానీ ) సమస్తమును పవిత్ర మొనర్చునట్టి ఈశ్వర ప్రసాదితములు, ఋషుల ద్వారా సంచితములు ( ఋచ ) ఛన్దోబద్ధములునైన వైదిక విషయముల నధ్యయనము చేయువారు పవిత్రమగు ఆనందరసము నాస్వాదించుచుందురు.

పావమానీర్దధంతు న ఇమం లోకం మథో అముమ్ ।
కామాన్త్సమర్థయన్తు నోదేవీర్దేవైః సమాహృతః ॥
(సామ. ఉత్తరార్చిక ౧౦-౬-౪)

సమస్తమును పవిత్ర మొనర్చు వేద ఋక్కులు ఇహపరలోకముల రెంటిని సుఖవంతము చేసికొనుటలో మనకు సహాయపడును. ( దేవ ) ఉత్తమ విద్వాంసుల ద్వారా, శ్రేష్ఠమగు ఇంద్రియముల ద్వారా పొందిన ఈ పవిత్ర ఋక్కులు శుభకరములైన మనకోరికలను తీర్చుగాక !
(సామ. ఉత్త. ౧౦-౬-౪)

పావమానీః స్వస్త్యయనీస్తాభిర్గచ్ఛన్తి నాన్దనమ్ ।
పుణ్యాంశ్చ భక్షాన్ భక్షయత్యమృతత్వం చ గచ్ఛతి ॥
(సామ. ఉ. ౧౦-౬-౬)

ఈ పవిత్ర ఋక్కులు కల్యాణప్రదములు. వీటి ద్వారా మానవులు ఆనందమును పొందగలరు. ఈ ఋక్కులతో నిండియున్న వేదముల స్వాధ్యాయము చేయువారు ఈ లోకమున ఉత్తమ భోగముల ననుభవించి మోక్షాధికారు లగుదురు.

మహర్షి పతంజలి స్వాధ్యాయ ఫలము నిట్లు తెలిపినాడు.

"స్వాధ్యాయాదిష్టదేవతా సంప్రయోగః" ॥ యోగదర్శ. ౨-౪౪॥

స్వాధ్యాయము ద్వారా మనుష్యుడు ఇష్ట దేవతలను అనగా శుభ గుణములను యథేచ్ఛగా పొందగలడు. పూర్వ మహా పురుషులు ఇప్పుడీ ప్రపంచమున లేరు. కాని వారి గ్రంథము లున్నవి. వాటి స్వాధ్యాయము వలన వారి భావములను తెలిసికొనవచ్చును. వాటిని మననము చేసి మన కోరికలను తీర్చుకొని ఫలమును పొందవచ్చును. ఈ సూత్రమునకు వ్యాస మహర్షి ఇట్లు భాష్యము వ్రాసినాడు.

"దేవా ఋషయః సిద్ధాశ్చ స్వాధ్యాయశీలస్య దర్శనం గచ్ఛన్తి కార్యేచాస్యవర్తన్తే"

స్వాధ్యాయ శీల వ్యక్తి మునుల, ఋషుల, మహర్షుల, స్వాధ్యాయ శీలుర దర్శనమును వారు వ్రాసిన గ్రంథముల స్వాధ్యాయము ద్వారా పొందును. తన సమస్త కార్యముల సిద్ధింపజేసికొనును.

"యద్యద్ధ వాయం ఛన్దసః స్వాధ్యాయమధీతే తేన తేన హైవాస్య యజ్ఞక్రతునేష్టమ్భవతి య ఏవం విద్వాన్త్స్వాధ్యాయమధీతే తస్మాత్స్వాధ్యాయోఽధ్యేతవ్యః ॥శతపథ బ్రా. ౧౧-౫-౭-౩ ॥

స్వాధ్యాయశీలురు ఏయే వేద స్వాధ్యాయము చేయుదురో వారికి ఆయా వేదముల యజ్ఞ ఫలము లభించగలదు. కావున ప్రతివ్యక్తి తప్పక స్వాధ్యాయము చేయవలయును.

జన్మతో ఎవ్వరును బ్రాహ్మణాది వర్ణములను పొందరు. వారి గుణకర్మ స్వభావముల ననుసరించియే బ్రాహ్మణ క్షత్రియాది వర్ణములను పొందుదురు. శూద్ర వర్ణమున జన్మించిన వ్యక్తి బ్రాహ్మణుడుగా,

బ్రాహ్మణవర్ణమున పుట్టిన వ్యక్తి శూద్రుడుగా కాగలడు. మను మహర్షి మనుస్మృతి (౧౦-౬౫, మరియు ౨-౨౮)లో ఇట్లు వ్రాసినాడు.

శూద్రో బ్రాహ్మణతామేతి బ్రాహ్మణశ్చైతి శూద్రతామ్।
క్షత్రియాజ్జాతమేవం తు విద్యాద్వైశ్యాత్తథైవ చ॥
స్వాధ్యాయేన వ్రతైర్హోమైస్త్రైవిద్యేనేజ్యయా సుతైః।
మహాయజ్ఞైశ్చ యజ్ఞైశ్చ బ్రాహ్మీయం క్రియతే తనుః॥

మహర్షి దయానందుడు పై శ్లోకములకు సత్యార్థ ప్రకాశమున అర్థము నిట్లు వ్రాసినాడు-స్వాధ్యాయము ద్వారా శూద్రుడు బ్రాహ్మణుడుగాను, స్వాధ్యాయహీనుడైన బ్రాహ్మణుడు శూద్రుడుగాను కాగలుగును. అట్లే స్వాధ్యాయము, గుణకర్మాదుల ననుసరించి క్షత్రియ, వైశ్యులు కాగల్గుదురు. (స్వాధ్యాయేన) సకల విద్యలను చదువుట చదివించుట (వ్రతైః) బ్రహ్మచర్య, సత్యభాషణాది వ్రత నియమములను పాటించుట (హోమైః) అగ్నిహోత్రాది హోమముల జేయుట, సత్యమును గ్రహించి అసత్యమును త్యజించుట, సత్య విద్యల ప్రచారముచేయుట (త్రైవిద్యేన) స్తుతిప్రార్థనోపాసనాదులను, వేద విహిత కర్మలను చేయుట, జ్ఞాన విద్యలను గ్రహించుట (ఇజ్యయా) పక్షేష్టిమున్నగు ఇష్ట యజ్ఞముల నొనర్చుట (సుతైః) చక్కని సంతానమును నిర్మించుట (మహాయజ్ఞైః) పంచ మహాయజ్ఞముల, అగ్నిష్టోమాదుల, శిల్ప విద్యా విజ్ఞానాది యజ్ఞముల అనుష్ఠానము, సేవనము వల్ల శరీరమును(బ్రాహ్మీయమ్) వేదముల, మరియు ఈశ్వర భక్తి ఆధారమున బ్రాహ్మణ శరీరముగా మార్చుకొనవచ్చును. ఈ సాధనములు లేక కేవలము బ్రాహ్మణ కులమున పుట్టినంత మాత్రమున బ్రాహ్మణ శరీరము కాజాలదు.

బ్రాహ్మణ-సర్వోత్తమ పురుషుడగుటకు స్వాధ్యాయమే ముఖ్యము. తనకన్న మిన్నయైన విద్వాంసుల, అనుభవజ్ఞుల, వేదశాస్త్రవేత్తల, ఋషుల, మహర్షుల గ్రంథముల స్వాధ్యాయ మొనర్చినపుడు మన మనో హృదయములలో వారి భావములను దృఢ పరచుకొందుము. అందువల్ల మన మానసిక శక్తి పెంపొందును. అనుకూలాచరణము వల్ల మనము గూడ వారివలె ధార్మికులము, విద్వాంసులము కాగల్గుదుము. స్వాధ్యాయ లాభముల నెంతవర్ణించినను తక్కువే. కేవలము స్వాధ్యాయబలముననే సాధారణ వ్యక్తి గూడ మహా విద్వాంసుడు కాగల్గును. ఇట్టి వేలాది ఉదాహరణములకు చరిత్రయే సాక్షి.

బర్మొంటు (అమెరికా)లో 'చార్లెస్ సిపార్సు' ఒక చర్మకారుడు. తన వృత్తి పనుల చేయుచు ప్రతి దిన మొక గంట గణితము నేర్చుకొనుటకు నిశ్చయించుకొనెను. ఆ ఒక్క గంట స్వాధ్యాయమువల్లనే పది సంవత్సరములలో ఉన్నత గణితజ్ఞుడై వెలసినాడు.

పండిత గురుదత్త ఎం.ఏ. విద్యాభ్యాసముతో బాటు వైదిక గ్రంథముల స్వాధ్యాయము చేసినాడు. మహర్షి దయానందుని తర్వాత పాశ్చాత్యుల వేద విరుద్ధ ఆక్షేపణలకు ఇరువదేండ్ల వయసులోనే చెంపపెట్టు వంటి తిరుగు లేని సమాధానము లిచ్చినాడు. ఆపైన పాశ్చాత్యులు మరెన్నడును వేద దూషిత ఆక్షేపణలొనర్చుటకు సాహసించలేదు. ఆయన గురుముఖమున వేద వేదాంగముల నెన్నడును విధి పూర్వకముగా చదువలేదు. స్వాధ్యాయమువల్లనే అంతటి విద్వాంసు డయ్యెను.

మహర్షి దయానంద సరస్వతీ, పం॥ లేఖరాం, పం॥ చమూపతి, ఎం.ఏ., శాస్త్రార్థ మహారథి పం॥ రామచంద్ర దెహల్వీ, మహాత్మా నారాయణస్వామీ మున్నగు సమస్త మహాపురుషుల జీవిత చరిత్రలను చదువుడు. వారందరు స్వాధ్యాయము వల్లనే మహోన్నత శ్రేణి విద్వాంసులు, రచయితలు, వక్తలు, శాస్త్రార్థ మహా రథులు కాగలిగినారు.

ఇట్టి వారెందరో ఈ కాలమునను ఉన్నారు. గ్రంథ విస్తరణ భీతిచే వారి గురించి వ్రాయుటలేదు.

మహాత్మాగాంధీ "ఉత్తమ గ్రంథములు వెంట నున్నవారికి సన్మిత్ర బృందము వెంటలేదను చింత ఏమాత్ర ముండదు. నేను సద్గ్రంథముల అధ్యయనము చేసినకొలది వాటిలోని విషయములు అధికాధికముగా తెలిసినవి" అని వ్రాసెను. సద్గ్రంథ పఠన కుతూహలముగలవారు ఎల్లెడలను సుఖముగా నుండగలరు. కావున స్వాధ్యాయ లాభముల దృష్ట్యా ప్రతి వ్యక్తి స్వాధ్యాయశీలు డగుటయే శ్రేష్ఠము, శ్రేయస్కరము.

## స్వాధ్యాయ క్రమము

స్వాధ్యాయ క్రమ మన నేమో ఆలోచించవలెను. వేదాదిశాస్త్రముల పఠన పాఠనమే స్వాధ్యాయమని సప్రమాణముగా తెలిపియుంటిమి. అనార్ష, అశ్లీల గ్రంథముల, వార్తా పత్రికల అధ్యయనము స్వాధ్యాయము కాజాలదు. వేదాధ్యయనమునకు నేటివలె అనేకవిధ గ్రంథముల అవసరము లేకుండెను. గురువులు శిష్యులకు వేదార్థములను తెలుపుచుండిరి. శిష్యులు వానిని కంఠస్థము చేయుచుండిరి. అందుకే వేదము 'శృతి' అనబడినది. కాలక్రమమున అట్టి స్మృతిశక్తి క్షీణించినందున శిష్యులు గురుముఖమున వేదార్థములను తెలిసికొను సామర్థ్యము లేనివారైరి. కావుననే వేదాంగ, ఉపాంగాదుల రచన జరిగినది. యాస్కాచార్యుడు ఇట్లు వ్రాసినాడు.

సాక్షాత్కృతధర్మాణ ఋషయో బభూవుః, తేఽవరేభ్యో సాక్షాత్కృతధర్మభ్య ఉపదేశేన మన్త్రాన్ సంప్రాదుః ఉపదేశాయ గ్లాయన్తోఽవరే, బిల్మగ్రహణాయేమం గ్రంథం సమామ్నాసిషుః, వేదం చ వేదాంగాని చ ( నిరుక్తము ౧-౨౦ )

సృష్ట్యారంభమున వేదార్థమును సాక్షాత్కరించుకొన్నట్టి ఋషులు వెలిసియుండిరి. వారు వేదార్థమును తెలిసికొనజాలనివారికి ఉపదేశముల ద్వారా వేదమంత్రముల అర్థజ్ఞానమును కలిగించుచుండిరి. క్రమముగా

శిష్యులు ఉపదేశముద్వారా వేదార్థముల నెరుగుటకసమర్థు లగుచుండిరి. అప్పుడు మహర్షులు జనులు సులభముగా వేదార్థముల గ్రహించునట్లు నిఘంటువు, నిరుక్తము మున్నగు వేదాంగ ఉపాంగములను రచించిరి.

కాని నేడు మనకొక ముఖ్య సమస్య ఎదురైనది. నేడు వేద వేదాంగముల పఠనపాఠనమే లోపించుచున్నది. వేదవిద్యల ప్రచార మొనర్చు బ్రాహ్మణులు అనార్యు లగుచున్నారు. వేద శిక్షణ సిచ్చుటటుం చుడు. వేదముల దర్శించిన భాగ్యశాలు రెందరు? జన్మించిన కులముపేరు చెప్పుకొని బ్రాహ్మణులనబడువారు బ్రతుకుచున్నారు. వేద విద్యల నభ్య సింపదలచినవారికి నేడు భారతావనిలో ఉత్తరప్రదేశ్, మధ్యప్రదేశ్, రాజస్థాన్, హరయాణా రాష్ట్రములలో కొన్ని అర్షగురుకులము లున్నవి.*

ప్రతివారు యోగ్యతనుబట్టి స్వాధ్యాయ క్రమమును నిర్ణయించు కొనవచ్చును. కాని ఏ విద్వాంసుని, ఆచార్యుని గాని అడిగి తెలిసి కొనుట మంచిది. స్వాధ్యాయ క్రమ నిర్ణయమునకు యోగ్యతయే కొలబద్ద. ప్రాథమిక విద్యార్థి విశ్వవిద్యాలయ తరగతులలో కూర్చున్నంత మాత్రమున అస్థాయి పుస్తకములను చదువజాలడు కదా! అట్లే సామాన్య జ్ఞానము గల వ్యక్తి వేదములను చదివి అర్థము చేసికొనుట కఠినము. కావున వేదానుకూల గ్రంథముల స్వాధ్యాయము చేసి స్వాధ్యాయ, జ్ఞాన శక్తిని పెంపొందించుకొనవలెను. ఉత్తమ వేదశాస్త్రములను చదువుచు మననము చేయుచున్నకొలది అతని జ్ఞానము పెంపొందుచుండును. శాస్త్ర పఠనము నందభిరుచియు పెంపొందుచుండును.

---

* తెలంగాణలో, ఇందూరు జిల్లా, కామారెడ్డిలోని అర్షగురుకులము నందు బ్రహ్మచారీ వేదవ్రత మీమాంసకులు వేద విద్యల నేర్పుటకు చక్కని వ్యవస్థ నేర్పాటుచేసినారు. అచ్చట ఋషులు, మహర్షులు, ఆధునిక ధార్మిక విద్వాంసులు రచించిన అలభ్య వైదిక గ్రంథములు అసంఖ్యాకముగ నున్నవి. వేదముల స్వాధ్యాయమునకు, అధ్యయమునకు చక్కని వాతావరణము గలదు.

కావున మొదట చిన్నచిన్న గ్రంథముల స్వాధ్యాయము చేయుచు క్రమముగా యోగ్యతను పెంచుకొనుచుండవలెను. పూర్ణ లాభము పొందుటకు మహర్షి దయానంద సరస్వతి నిర్దేశించిన ప్రాచీనార్ష విధి ననుసరించి వేదాది శాస్త్రముల అధ్యయనము చేయవలెను. గంగోత్రిలోని నీటిని త్రాగిన కలుగు ఆనందము హుగ్లీలోని మురికి నీటిని త్రాగుట వల్ల కలుగదు. అట్లే ఉత్తమ సాహిత్యమును యథావిధి స్వాధ్యాయము చేయు వారికి చెత్త సాహిత్యము రుచించదు. విధి పూర్వకముగా వేదాధ్యయనము చేయజాలనివారు స్వాధ్యాయము ద్వారా ఆత్మోన్నతిని తప్పక సాధింప వచ్చును.

అక్షర జ్ఞానము తరువాత గ్రంథ పఠన శక్తి కలుగగనే మహర్షి దయానంద సరస్వతి, స్వామీ శ్రద్ధానంద, పండిత గురుదత్త విద్యార్థీ, శాస్త్రార్థ మహారథి రామచంద్ర దెహల్వీ, మహాత్మా హంసరాజ్, లాలా లాజపతరాయ్, భీష్మపితామహ, మహావీర హనుమాన్, స్వామీ శంకరా చార్య, బ్రి. రాంప్రసాద్ బిస్మిల్, చంద్రశేఖర్ ఆజాద్, సర్దార్ భగత్ సింహ వంటి మహాపురుషుల జీవిత చరిత్రల స్వాధ్యాయము చేయవలెను. పిదప ఇతిహాసములు, ధర్మశాస్త్రములు, మహర్షి దయానందరచిత సత్యార్థప్రకాశము, ఋగ్వేదాదిభాష్యభూమిక, వేదభాష్యములు మున్నగు గ్రంథములను యోగ్యతానుసారము అధ్యయనము చేయుచుండవలెను.

## స్వాధ్యాయము - శ్రావణి

స్వాధ్యాయమునకు శ్రావణి పర్వమునకు సంబంధము ప్రాచీన కాలమునుండి నేటివరకు కొనసాగుచున్నది. మనుస్మృతిలో

శ్రావణ్యాం ప్రోష్ఠపద్యాం వాప్యుపాకృత్య యథావిధిః ।
యుక్తశ్ఛందాంస్యధీయీత మాసాన్ విప్రోఽర్ధపంచమాన్॥

శ్రావణ లేక భాద్రపదమందలి పూర్ణిమనాడు ఉపాకర్మచేసి నాల్గున్నర నెలలవరకు వేదముల అధ్యయనము కొనసాగించవలె నని వర్ణించబడినది. కూర్మ పురాణములో నిట్టి వర్ణనయే కలదు.

ఉత్సృజ్య గ్రామనగరం మాసాన్ విప్రోఽర్థపన్చమాన్ ।
అధీయీత శుచేదేశే బ్రహ్మచారీ సమాహితః ॥కూర్మ పు. ఉప. ౧౩॥

నాల్గున్నర నెలలవరకు గ్రామ, నగరములకు దూరముగానున్న ఏకాంత పవిత్ర స్థానమున కేగి ఏకాగ్రచిత్తులై. జితేంద్రియులై వేదముల స్వాధ్యాయము చేయవలెను,

ఇదే విధముగ యాజ్ఞవల్క్యస్మృతి, బోధాయనస్మృతి, వాసిష్ఠస్మృతి, వాల్మీకి రామాయణములందును, ఆశ్వలాయన, పారస్కర, లోగాక్షి. గోభిలీయాది గృహ్యసూత్రము లందును శ్రావణ మాసములో విశేషముగా వేద స్వాధ్యాయ విధానము లభించుచున్నది.

శ్రావణిలో చేయదగిన దేమి? పురాణత్యాగము, నవీన ధారణము. పాత యజ్ఞోపవీత మేఖలాదుల విసర్జించి క్రొత్తవానిని ధరించి స్వాధ్యాయ క్రమమును మార్చుకొనుట. శ్రావణమునుండి పుష్యమువరకు నాలుగైదు నెలలవరకు విశేషరూపమున వేద వేదాంగముల స్వాధ్యాయము చేయబడును. మరల శ్రావణిరాగానే పూర్వమువలెనే వేద స్వాధ్యాయము చేయబడును.

శ్రావణికి విశేషమహత్త్వ మేర్పడినది వేదాధ్యయనమువల్లనే. సమస్త సత్య విద్యలకు వేదమే మూలము. ప్రపంచమందలి సమస్త సత్య విద్యలు, సంపూర్ణ జ్ఞాన విజ్ఞానములు, కళాకౌశలములు మున్నగున వెల్ల బీజరూపమున వేదములందున్నవి.

చాతుర్వర్ణ్యం త్రయోలోకాశ్చత్వార ఆశ్రమాః పృథక్ ।
భూతం భవ్యం భవిష్యం చ సర్వం వేదాత్ప్రసిద్ధ్యతి ॥
(మను. ౧౨-౯౭)

బ్రాహ్మణాది నాల్గువర్ణముల, బ్రహ్మచర్యాది నాలుగాశ్రమముల, ధర్మములు, భూత భవిష్యద్వర్తమానాదుల జ్ఞానమంతయు వేదాధ్యయనము వల్లనే కలుగును. "వేదఃస్మృతి సదాచారః స్వస్య చ ప్రియ మాత్మనః" అను నాల్గు ధర్మ లక్షణములలో సర్వోన్నత స్థానము వేదములదే. ఏలన "వేదో౽ఖిలో ధర్మమూలమ్"(మను. ౨-౬)-ధర్మోత్పత్తిస్థానము వేదమే. కావున వేదవిహితమైనదే ధర్మము, దానికి విరుద్ధమైనది అధర్మము.

## స్వాధ్యాయము - బ్రహ్మచర్యము

స్వాధ్యాయ బ్రహ్మ చర్యములకు పరస్పరము ఘనిష్ఠ సంబంధము గలదు. వేదాది పవిత్ర గ్రంథముల స్వాధ్యాయము చేయనిదే మానవుని ఆలోచనలు పవిత్రముగ నుండ జాలవు. సంకల్పశుద్ధి లేకున్న బ్రహ్మ చర్య పాలనము ( వీర్య రక్షణము ) అసంభవము. బ్రహ్మచర్య పాలన లేకున్న సమస్తము నిష్ఫలము, నిస్సారముగ నుండును. ప్రపంచమున వీర్యరక్షణ చేసికొనని ఏ వ్యక్తియు ఎట్టి మహత్కార్య సాధనమునను సఫలుడు కాజాలడు. వీర్యరక్షణము చేసికొన్నవారు సంకల్పించిన మహత్కార్యములను సాధించగలిగినారు. "బ్రహ్మచర్యం పురుషార్థ సాధనమ్" బ్రహ్మచర్యము పురుషార్థ ( ధర్మార్థకామమోక్షముల ) సిద్ధికి సాధనము. ఉపనిషత్తులు గూడ "యదిచ్ఛంతో బ్రహ్మచర్యం చరన్తి"-శ్రేయో మార్గమున నడచువారు ఈశ్వర ( మోక్ష ) ప్రాప్తికోరికగలవారై బ్రహ్మ చర్యమును పాలింతు రని తెలిపినవి.

ప్రాచీన కాలమున స్వాధ్యాయమునకు, బ్రహ్మచర్యమునకు గొప్ప గౌరవ ప్రపత్తు లుండెడివి. తైత్తిరీయారణ్యకములో ఒక కథ ఇట్లున్నది.

భరద్వాజుడు మూడాయువుల వరకు బ్రహ్మచర్య ధారణమొనర్చినాడు. వృద్ధుడై మరణశయ్యపై నుండ ఒకనా డాయనవద్దకు ఇంద్రుడరుదెంచి "భరద్వాజా! ఒక వేళ నీకు నాల్గవ ఆయువు లభించిన ఏమి చేయగలవని అడిగెను. అందుకు భరద్వాజుడు "ఆ నాల్గవ ఆయువునందును బ్రహ్మచర్యపూర్వకముగ విద్య నభ్యసించెద" ననెను. బ్రహ్మచర్యము, బ్రహ్మచారి అను శబ్దములే వేద పఠనమే, స్వాధ్యాయమే బ్రహ్మచారి పరమ ధర్మమని తెలుపుచున్నవి. 'బ్రహ్మ'యన ఈశ్వరుడు, వేదము, జ్ఞానము. 'చర్య' మనగా చింతనము, అధ్యయనము, ఉపార్జన. ఇదియే బ్రహ్మచర్య శబ్దమున కర్థము.

ఈశ్వరచింతనము, వేదాధ్యయనము, జ్ఞానోపార్జన అనునవి వేద స్వాధ్యాయమందు, బ్రహ్మచర్య పాలనమందు మిక్కిలి సహాయకములు. మహాత్మా నారాయణస్వామి గూడ స్వాధ్యాయము బ్రహ్మచర్యమునకు సాధకమన్నాడు.

మహాభాష్యకర్త మహర్షి పతంజలి నవాహ్నికములో ఇట్లువ్రాసినాడు.

'చతుర్భిః ప్రకారైర్విద్యోపయుక్తా భవతి, ఆగమకాలేన, స్వాధ్యాయ కాలేన, ప్రవచనకాలేన, నిదిధ్యాసనకాలేనేతి'

అనగా చక్కగా విద్యను పొందుటకు నాల్గు విధములు-'ఆగము కాలము'-గురు ముఖతః చదువుట, 'స్వాధ్యాయకాలము'-చదివిన దానిని చక్కగాస్వయముగ స్వాధ్యాయ మొనర్చుట, 'ప్రవచనకాలము'-ఆపై దాని ప్రవచనము చేయుట, 'నిదిధ్యాసన కాలము'-దానిని సాక్షాత్కరించు కొనుట. దీనినే వ్యవహారకాలము అని కూడ అందురు. ఇట్లు విద్యా ప్రాప్తికి బ్రహ్మచర్య పాలనమునకు స్వాధ్యాయ మత్యంతావశ్యకము. ఈ రెంటికి అవినాభావ సంబంధమున్నది. స్వాధ్యాయములేనిదే బ్రహ్మచర్య (వీర్య) రక్షణము సాధ్యపడనట్లే బ్రహ్మచర్యము పాటింపనిదే

స్వాధ్యాయము స్థిరచిత్తముతో తృప్తికరముగా చేయుటకు సాధ్యపడదు. చిత్తము, ఇంద్రియములు చంచలముగా నున్నపుడు చేసిన స్వాధ్యాయము విశేషలాభకరము కాజాలదు. చేసిన కృషి వ్యర్థమగును. కావున బ్రహ్మచర్యము స్వాధ్యాయమునకు, స్వాధ్యాయము బ్రహ్మచర్య పాలనమునకు అత్యావశ్యకమైనవి.

## స్వాధ్యాయము - ఎట్లు ? ఎందుకు ?

"నాస్తి వేదాత్పరం శాస్త్రమ్ "-వేదములకు మించిన ఏ శాస్త్రములుగాని గ్రంథములుగాని లేవు. "వేదశ్చక్షుః సనాతనమ్"-అన్నిటి కన్న ప్రాచీనమైన జ్ఞాన విజ్ఞాన స్రోతస్సు వేదమే. 'బుద్ధిపూర్వా వాక్యకృతిర్వేదే' వేదములోని ప్రతి వాక్యము బుద్ధిపూర్వకమైనది. అందు విపరీత శబ్ద మొక్కటియులేదు. కాన వేద స్వాధ్యాయమే చేయవలెను. మనుస్మృతి (౪-౧౪౭) ఇట్లు తెలుపుచున్నది.

వేదమేవాభ్యసేన్నిత్యం యథాకాలమతన్ద్రితః।
తం హ్యస్యాహుః పరం ధర్మముపధర్మోఽన్య ఉచ్యతే॥

ఆలస్య ప్రమాదములను విడిచి ప్రతి దినము నియమిత కాలమున స్వాధ్యాయము చేయుటయే పరమధర్మము. మిగిలినవన్నియు ఉపధర్మములు. మహర్షి దయానందుడు కూడ వేదములను చదువుట చదివించుట, వినుట వినిపించుట పరమధర్మమని తెలిపినాడు. మహర్షి పతంజలి మహాభాష్యములో 'బ్రాహ్మణేన నిష్కారణో ధర్మః షడంగో వేదోఽధ్యేయో జ్ఞేయశ్చ'-సాంగోపాంగముగ వేదములను నిస్స్వార్థముగ చదువుటయే బ్రాహ్మణుని ధర్మమని తెలిపినాడు.

ఇచట బ్రాహ్మణుని అన్ని వర్ణములకన్న ముఖ్యమని గ్రహించిన కారణమున 'బ్రాహ్మణ' అనగా వేదము. మానవమాత్రులెల్లరును

వేదాధ్యయన మొనర్చుట పరమ ధర్మము. వేదములను, వేదానుకూల గ్రంథములనే స్వాధ్యాయ మొనర్చవలెను. వేద విరుద్ధమగు గ్రంథము లన్నియును త్యాజ్యములనియే తెలిసికొనవలయును.

" యా వేదబాహ్యాః స్మృతయో యాశ్చ కాశ్చ కుదృష్టయః।
సర్వాస్తా నిష్ఫలాః ప్రేత్య తమోనిష్ఠా హి తాః స్మృతాః ॥
(మను. ౧౨-౯౫)

స్మృతిశాఖాది వేద విరుద్ధ గ్రంథములన్నియును నిష్ఫలములు. (తమోనిష్ఠః) అజ్ఞానాంధకారములచే ఆచ్ఛాదితములై యుండు కారణమున వానిని త్యజించవలయును. వేద విరుద్ధ గ్రంథముల జదివినందువల్ల లాభ మెంత మాత్రమును ఉండదు. పైగా ఎంతయో హాని కలుగును. మనుస్మృతి, కూర్మ పురాణములు (వేదానుకూలముగ నున్నంతవరకు) అన్నియును వేదములను చదువనివానిని మూఢుడు, శూద్రుడు, మరియు సమాజ బహిష్కృతు డని తెలుపుచున్నవి.

అనార్ష, అశ్లీలములైన నవల నాటకాది గ్రంథములను చదువు వారెన్నడును బ్రహ్మచారులుగను, సదాచారులుగను నుండజాలరు. శృంగార రసముచే నిండిన ఇట్టి గ్రంథములను చదువుట తన గృహమునకు తానే నిప్పుపెట్టు కొనినట్లగును. అశ్లీల గ్రంథములను చదువుట వల్ల బ్రహ్మచారియైనను వ్యభిచారియగునన సామాన్యుల విషయము చెప్పవలెనా!

మహర్షి దయానంద సరస్వతి సత్యార్థ ప్రకాశములో పఠన పాఠన విధియందు పఠింపదగిన, పఠింపదగని గ్రంథములను గూర్చి వ్రాసి యున్నాడు. వానిలో కొన్ని ఇట పేర్కొనబడుచున్నవి. వివరములకొరకు సత్యార్థ ప్రకాశము, సంస్కార విధి చూడనగును.

ఇప్పుడిట పరిత్యజించదగిన గ్రంథములను గూర్చి సంక్షేపముగా వ్రాయబడుచున్నది. దిగువ వ్రాయబడిన వన్నియును కల్పిత గ్రంథములని తెలియవలెను. "వ్యాకరణమునందు కాతంత్ర, సారస్వత, చంద్రికా, ముగ్ధబోధ, కౌముది, శేఖర, మనోరమాదులు నిఘంటువులందు అమర కోశాదులు, ఛందస్సులందు వృత్తరత్నాకరాదులు, శిక్షలలో 'అథ శిక్షాం ప్రవక్ష్యామి పాణినీయం మతం యథా' ఇత్యాదులు, జ్యోతిష్యములందు శీఘ్రబోధ, ముహూర్తచింతామణి ఇత్యాదులు, కావ్యములందు నాయికా భేదము, కువలయానందము, రఘువంశము, మాఘము, కిరాతార్జునీయము, మున్నగునవి. మీమాంసలందు ధర్మసింధువు, వ్రతార్కము, మొదలగునవి. వైశేషికములందు తర్కసంగ్రహాదులు, న్యాయశాస్త్రములందు జగదీశీ మున్నగునవి. యోగమునందు హఠప్రదీపికాదులు, సాంఖ్యములందు యోగవాశిష్ఠము, పంచదశీ మున్నగునవి. వైద్య గ్రంథములందు శారఙ్గధర సంహితాదులు, స్మృతులందు మనుస్మృతియందలి ప్రక్షిప్తశ్లోకములు, మరియు ఇతర స్మృతులన్నియును. సమస్త తంత్ర గ్రంథములు, సకల పురాణములు, తులసీదాస రచిత భాషా రామాయణము, రుక్మిణీ మంగలాదులు, మరియు సర్వ భాషా గ్రంథములు- ఇవి కపోల కల్పితములగు మిథ్యా గ్రంథములు, కావున త్యాజ్యములు.

ప్రశ్న:-ఈ గ్రథములందు సత్య మేమియును లేదా?

ఉత్తరము:-సత్య మేకొంచెమైన నున్నను దానితో బాటు అసత్యము సంపూర్ణముగా నిండి ఉన్నది. అందువల్ల "విషసంపృక్తాన్నవత్ త్యాజ్యాః" అత్యుత్తమములగు భోజ్య పదార్థములందు కొద్దిపాటి విషము చేరినను వానిని వదలివేయవలసియుండును గదా! ఈ గ్రంథములు కూడా అట్టివే. (సత్యార్థ ప్రకాశము మూడవ సము.)

# స్వాధ్యాయమునకు తగిన గ్రంథములు

ఋగ్యజుస్సామాథర్వణము లను నాల్గు వేదములు, ఆయుర్వేద, ధనుర్వేద, గాంధర్వవేద; అర్థవేదము లను నాలుగు ఉపవేదము; శిక్షా, కల్పము, వ్యాకరణము, నిరుక్తము, ఛందస్సు, జ్యోతిషము అను ఆరు వేదాంగములు; సాంఖ్య, యోగ, న్యాయ, వైశేషిక, పూర్వమీమాంస, ఉత్తర మీమాంస (వేదాంతము)లను ఆరు దర్శనములు; ఉపాంగములైన ఐతరేయ, శతపథ, గోపథము లను నాల్గు బ్రాహ్మణములు; ఈశ, కేన, కఠ, ప్రశ్న, ముండక, మాండూక్య, ఐతరేయ, తైత్తిరీయ, ఛాందోగ్య, బృహదారణ్యకము లను పది ఉపనిషత్తులు; ఋషులు మునులు వ్రాసిన మనుస్మృతి, రామాయణ, మహాభారతాది అర్ష గ్రంథములు (వేదవిరుద్ధములైన ప్రక్షిప్తములను వదలివేయవలెను). వేదములు ఈశ్వర కృతము లగుటచే నిర్భ్రాంతములు. అవి స్వతః ప్రమాణములు. అనగా వేదములకు ప్రమాణము వేదములే. ఇతర బ్రాహ్మణాది సమస్త గ్రంథములు పరతః ప్రమాణములు. అనగా వీని ప్రామాణ్యము వేదాధీనమైనది.

ఈ ప్రాచీన గ్రంథములే గాక మహర్షి దయానంద విరచిత వేద భాష్యములు, సత్యార్థ ప్రకాశము, సంస్కార విధి, ఋగ్వేదాది భాష్య భూమిక, వ్యవహారభానువు, ఆర్యాభివినయము, గోకరుణానిధి, ఆర్యోద్దేశ్య రత్నమాలా మున్నగు సమస్త గ్రంథములు; ఆధునిక ధార్మిక విద్వాంసులు రచించిన ఉత్తమ గ్రంథములు, వేద సిద్ధాంతము, రాజనీతి, సమాజ శాస్త్రము, పౌరశాస్త్రము, శిల్ప విద్య మున్నగు విషయములపై శ్రేష్ఠమైన, అశ్లీలములులేని గ్రంథములు అధ్యయనము చేయవలెను.

ప్రపంచములోని సమస్త మహా పురుషుల జీవిత చరిత్రలు ముఖ్యముగా చదువదగును. వీని స్వాధ్యాయము ద్వారా జీవనోన్నతిని సాధించుటకు ప్రేరణ, సహాయము లభించును.

# ఆర్ష గ్రంథముల మాహాత్మ్యము

'ఆర్షగ్రంథములన్నియు సత్యమార్గమును ప్రదర్శించును. మానవ జీవితములను అమరముచేయు అమృతకలశము'లవి అని ఒక కవి ఉక్తి.

ఆర్ష అనార్ష గ్రంథముల తెలిసికొనుట జటిలము. ఆర్షము లేవి? అనార్షము లేవి? అను ప్రశ్నకు సామాన్య సమాధానము "ఋషిభిప్రోక్త మార్షమ్"-ఋషులచే రచింపబడిన గ్రంథములన్నియు ఆర్షములు, అని. కాని ఋషుల పేర్లతో ధూర్తులు, స్వార్థులు అనేక పాషండ గ్రంథముల వ్రాసి ప్రకటించినారు. ఐన ఆర్షగ్రంథములను 'ఋషిభిః ప్రోక్త మార్షమ్, వేదానుకూలం చేత్" అను సూత్రము ననుసరించి తెలిసికో వచ్చును. వేదానుకూలమైననే అవి ఆర్షములని గ్రహింపవలెను. వేద విరుద్ధమైనవి ఆర్షములు గావు. ఆర్ష అనార్ష; ఋషి అన్ఋషి రచనల గురించి గ్రంథ విస్తరణ భీతిచే ఇట వివరించుట లేదు. ఆర్షగ్రంథముల మాహాత్మ్యమేమి? వానినేల చదువవలె నను విషయమున సంస్కరణాగ్రేసర శ్రీ మద్దయానంద మహర్షి వచనములే ఇట పేర్కొనబడుచున్నవి.

"ఋషులు మహా విద్వాంసులు, సకలశాస్త్ర పారంగతులు, ధర్మాత్ములునై యుండిరి. అందువల్లనే ఋషులు రచించిన గ్రంథములనే అధ్యయనము చేయవలెను. ఋషులుగానివారు, అల్పశాస్త్రజ్ఞులు, పక్షపాత బుద్ధి గలవారు రచించిన గ్రంథములు వారి గుణములవలెనే పాషండము, పక్షపాతముతో కూడియుండును.

మహా పురుషులైన మహర్షులు తమకు సహజముగా సిద్ధించిన మహోన్నత విషయములను తమ గ్రంథముల ద్వారా ప్రకటించినారు. ఇట్టి మహోన్నత విషయములు క్షుద్రాశయము గలవారి కల్పిత గ్రంథములం దుండజాలవు. మహర్షుల ఆశయము వీలైనంత సుగమము. దానిని

గ్రహించుటకు చాల కొద్ది సమయమే అవసరము. కాని క్షుద్రాశయము గలవారి రచనలు మిక్కిలి కఠినములు, వానినర్థము చేసికొనుట కఠినము. అవి మనస్సును తికమకపెట్టి అధిక శ్రమను గలిగించును. అంతటి శ్రమ కోర్చినను లాభము స్వల్పమే. అది కొండను త్రవ్వి ఎలుకను పట్టినట్లుండును. కాని ఆర్ష గ్రంథముల జదువుట ఒక్క మునుకలో బహుమూల్య ముత్యములను పొందినట్లుండును." (సత్యార్థ. ౩వ సముల్లాసము)

## ఉపసంహారము

పాఠకులారా! ఈ చిన్న పుస్తకమున స్వాధ్యాయము యొక్క ఆవశ్యకత. స్వాధ్యాయ పదమున కర్థము, స్వాధ్యాయ మహిమ దాని లాభము, దాని క్రమము మున్నగు అవసర విషయము లన్నియు ప్రమాణపూర్వకముగా వ్రాయబడినవి. కాని మేము వ్రాయుట, మీరు చదువుట మాత్రముననే సరిపోదు. ఆచరించినప్పుడే వ్రాయుట, చదువుట సార్థక మగును. ఆచరించిననే ఫలముండును. 'పంచదార' శబ్దము నెంతకాల ముచ్చరించినను మన నోరు తీయబడదు గదా! 'నిర్మల' శబ్దము నెంత సేపు జపించినను శుభ్రత చేకూరదు. సద్గుణ దుర్గుణముల శ్రద్ధగా నాలోచించి మంచి గుణములను అలవరచుకొనుచు చెడు గుణములను త్యజించినప్పుడే మేలు గలుగును. ఉత్తమమని నిశ్చయించిన విషయమును గాని కార్యమును గాని ఎప్పుడును వదలవలదు. పట్టుదలతో చేయుచుండవలెను. అట్లు చేయుటయందే సఫలత ఇమిడియున్నది. భర్తృహరి నీతిశతకములో ఇట్లు వ్రాసినాడు.

"ప్రారభ్యతే న ఖలు విఘ్నభయేన నీచైః"
ప్రారభ్య విఘ్న నిహతా విరమంతి మధ్యాః।
విఘ్నైః పునః పునరపి ప్రతిహన్యమానాః,
ప్రారభ్యచోత్తమ జనా న పరిత్యజంతి॥ (నీతిశ. ౨౭)

విఘ్న బాధలకు భయపడి శ్రేష్ఠ కార్యముల ప్రారంభించనివాడు అధముడు, నికృష్టుడు. కార్యము నారంభించి ఆపదలకు భయపడి మధ్యలోనే వదలువాడు మధ్యముడు. విఘ్నములకు, బాధలకు భయపడక వాని నధిగమించి తన లక్ష్యమును సాధించుకొను పురుషార్థియే ఉత్తముడు.

ఈశ్వరుడు మన ఉన్నతికొరకే మానవ శరీరము నిచ్చినాడు, అవనతికొరకు కాదు. వేదము ఇట్లాదేశించుచున్నది.

"ఉద్యానం తే పురుష నావయానమ్"

ఓ మానవా! ఉన్నతిని పొందుము. ఉత్తముడ వగుము. కల్యాణ పథికుడవు కమ్ము. మోక్షానందమును పొందుము. ధర్మమను రథము నెక్కి సత్య మార్గమున పయనించి లక్ష్యమును సాధించుకొనుము. (నావయానమ్) పతనమార్గమున నడచినచో పతనము తప్పదు. ముందుగనే జాగ్రతపడుట మంచిది. పాపపంకిలమున దిగబడి పూర్వమువలె పైకి వచ్చుట అతికఠినము. జాగ్రత్తగ పతన మార్గమున ఒక అడుగైనను వేయక సదా ఉన్నతి మార్గముననే పయనించుట ఉత్తముల, బుద్ధిమంతుల లక్షణము.

